# శుద్ధపత్రము

## కురంగి

| పేజీ పంక్తి | పుస్తకములోనిది | మార్పు |
| --- | --- | --- |
| అంకితము 13 పంక్తి | సంతతసమత్పీభూత భోగుండు | సంతతక్ష్మాత్రీభూత భాగ్యుండు |
| 7—13 | అఱమర | అరమర |
| 8—24 | స్వభావనిర్దయుఁ | స్వభావసంతయుఁ |
| 10—6 | శు। భ్రభష్మవగోఘృతం బువ విరాజిలు | శుం। భషష్మవగోఘృతం బువ విభాసిలు |
| 14—16 | నాజన్మ | నాపాత |
| 18—3 | పల్కాకవోయె నిర్దయుఁ | పల్కాకవోయె నేమియుఁ |
| 21—1 | వాక్యసమితిసంజన్య | వాక్యసమితిసంజాత |
| 21—15 | ప్రాణాపాయ ... | ప్రాణాపాయమొంచుఁ జనవ్యాపారంబులు |
| 23—6 | మూలదుంప | మూలకందమనియు |
| 23—19 | ఉత్కంఠితమై | ఉత్కంఠతోఁ |
| 24—14 | కన్నీరు నోద్చుచుండ | కన్నీటి నోద్చుచుండ |
| 25—21 | మూర్ఛానిబధ్యమానుడ | మూర్ఛానిపీడ్యమానుడ |
| 26—22 | దుర్నివార్య | దుర్నివార |
| 27—7 | నాజీవితప్రమోద | నాజీవనప్రమోద |

# కురంగి



గ్రంథకర్త


## పంగనామముల రామచంద్రరావు

టీచర్, బోర్డు హైస్కూల్,

గుంటూరు.





గుంటూరు చంద్రికా ముద్రాక్షరశాలలో

ముద్రింపబడినది.





రక్తాక్షి సం॥ చైత్రమాసము.

ఏప్రిల్ 1924.


అ

 [వెల 0—6—0.

నే నీచిన్న పుస్తకమ్మును 1920 సంవత్సరములో వేసంగి సెలవులలో వ్రాసితిని. దీని నిప్పటివఱకు నచ్చొత్తింపకుండుటకు ధనాభావమే కారణము. ఈదారిద్ర్యపిశాచమే యనంతరప్రయత్నంబులకు నడ్డంకి యగుచున్నది. పద్యరచనంబునకై కడంగి సిరుత్సాహంబు పైబడి కాగితంబుపైఁ గల మాడనిస్థితి నేడు ప్రాప్తించినది. కవి గ్రంథరచనంబుఁ గాంచఁగానే బాగోగులఁ బరికించి లోకమే దాని నాదరించు ననియు ననంతరప్రయత్నంబుల సాగించుచునే యుండవలయుననియు—యీ మొదలగునీతివాక్యంబులు— మొదటవ్రాసినపుస్తకంబులు బయలు వడనిచోఁ బయువానిపై మనసుపోవని నావంటి సామాన్యజనుని చిత్తంబున కంతగా నచ్చులేదు. ధనార్జనశక్తిలేని వానికి వివాహంబును దరిద్రుఁడయ్యు యాచ్ఞాసామర్థ్యము లేనికవికి గ్రంథరచనంబును గూడనివను లని నాదృఢాభిప్రాయము.

ఒక్కమాఱు నేను సంపర్కించి నాపుస్తకంబుఁ గూర్చియుంచుక చెప్పఁగానే వల్లెయని ముద్రింపించిన శ్రీ శ్రీ చిరుమామిళ్ళ లక్ష్మీ నారాయణప్రసాద్, బి. ఎ., గారికి నాకృతజ్ఞతాపూర్వకవందనంబుల నర్పించుచున్నాను.

| | |
|---|---|
| గుంటూరు. | ఇట్లు విధేయుఁడు, |
| 23-4-24. | పంగనామముల రామచంద్రరావు. |
| | గ్రంథకర్త. |

# ముఖవచనము.

“కురంగి” యను విద్యావిశారదయగు నొక కమ్మబాలికకు రామమోహనుఁ డను సఖునిపై వలపుచే గలిగిన మన్మథావస్థ లిందు వర్ణింపఁబడినవి. ఇది నవీనపద్ధతి ననుసరించి వ్రాయఁబడిన యొక 'నవల'. ఎక్కడనో యొక్కచోట దక్క గ్రంథమంతయుఁ బద్యరూపముగా నున్నది. ఇందలి కరుణారసము సముచితముగా నుండుటయే కాక శృంగారరసమును వెగటుగా నుండక పాత్రానుపోషణముగ నుండి వన్నెమీఱి యున్నది. పద్యములు రమారమి నూటముప్పది కలవు. కవితాధోరణిం జూడ గ్రంథమంతయు ముద్దులు గుల్కుచున్నది. అక్కడక్కడఁ గొన్ని నూత్నకల్పన లిందుఁ జక్కఁగాఁ బొందుపఱుపఁబడియున్నవి. మన్మథావస్థలలోఁ జరమావస్థయైన మరణముతో 'కురంగి' ముగిసినది. పొత్తము మొదటినుండి తుదవఱకును ద్రాక్షాపాకమున నొప్పుచున్నది. ఆంధ్రభాషలోఁ బ్రకృతకాలమున నవల లెన్నో వచనరూపమున బయలు వెడలుచున్నవి. కాని దీనివలెఁ బద్యమున నరిదిగానున్నవి. ఇంతయేల? ఈనవల యాంధ్రసారస్వతమునఁ గ్రొత్తత్రోవఁ ద్రొక్కి పద్యాత్మకములగు నవలల కాదర్శముగా నున్నదని చెప్పనొప్పును.

ఇట్లు విన్నవించు,

గుంటూరు.
1-4-24

మల్లాది వెంకటసోమయాజులు,
గుంటూరు హైస్కూలు
నందలి యుపాధ్యాయుడు.

# అంకితము.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరాయ నమః.

గీ॥ నాకుఁ జేనైనరీతి సందర్భపఱచి
యేదొ లిఖియించి భవదీయపాదపద్మ
యుగసమర్పణమును జేయుచుంటి వేంక
టేశ! శ్రీనిధి! కైకొను మీ "కురంగి"॥

మ॥ స్తుతిపాత్రస్థిరసత్ప్రబంధరచనాస్తోకైకపాండిత్య మా
ర్జితమై యుండమి నాకుఁ దోఁచినటు లీరీతిన్ వినిర్మించి దు
ర్మతిసంవత్సరచైత్రశుక్లనవమిం గ్రంథంబు నీపేర "నం
కితముం" గూర్చితిఁ జూచుచుండఁగఁ గృపాదృష్టిన్ వేంకటేశప్రభూ!॥

ఇట్లు విధేయుఁడు.

పంగనామముల రామచంద్రరావు.

---

శ్రీ తిరుపతివేంకటేశ్వరచరణాభ్యాంనమః.

శా॥ శ్రీకళ్యాణగుణుండు, సంతతసమక్షీభూతభోగుండు, సు
శ్లోకుం డద్భుతకీర్తివంతుఁడు సమాలోక్యుండు నారాయణుం
డేకబ్బంబు భవత్పదార్పితము స్వామీ! వెల్గులోఁ బెట్టి, నీ
వాకమ్మాన్వయుఁ జల్లచూపు లిడి దీర్ఘాయుర్వహుం జేయుమా॥

మ॥ అరయన్ జ్ఞానకళాధనత్రయము "పూజ్యం"బైననాఁబోఁటిపా
మరు నుల్లోకవిరాజమానగుణసంపచ్ఛాలి వయ్యున్ నగాం
తరముం దేడనొ మాఱుమూలవసతిం గన్నట్టి నిన్నున్ గరం
బెఱుకం జేసె నతండె యెల్లరకుఁ దద్వృద్ధిన్ సమీక్షింపుమా॥

మ॥ చిరుమామిళ్ళకులాబ్ధిచంద్రముఁడు 'లక్ష్మీ' పూర్వనారాయణుం
డురుభాగ్యుండు లసద్గుణుండు భవదీయోత్కృష్టపీఠాపరం
పరచేతం గవితాభిమానమతి దుర్వారాతినారిద్ర్యని
ర్భరులైయుండెడి సత్కవీంద్రులకు సారప్రాజ్యమై క్రాలుతన్॥




మ॥ "అతిదూరంబు నలంత యేఁగనగు భాగ్యశ్రీవిమూర్ధాత్మ్య వ
చ్చితి విశ్రాంతిరసంబుఁ గోరెఁగ నదే శీఘ్రంబుగా జాడదీ
ధితిఁ గోల్పోయెను భాస్కరుం డికను సందేహింపకే నొక్కనై
కతభాగంబున బ్రొద్దుపుత్తుఁ బ్రకృతిం గంటిన్ సమీక్షించుచున్

మ॥ నదితీరంబున నిట్టులన్ నడచుచున్నన్ గాలు నొవ్వంగఁ బూ
నదు చిత్తంబు పరావధానమును జెందన్ మాటికిన్ మాటికిన్
సుదతీదివ్యముఖారవిందమననక్షోభంబునం దుండి నె
మ్మది రాజాలక యుండెఁ దద్విషయసంబాధాతిరేకంబునన్॥

గీ॥ కాలునడ లిందుఁ గొన్ని ముత్యాలసరులఁ
బోలు సొబగున లావణ్యమును నిగుడ్చు
నిద్దపుం దెల్పుటిసుకపై నద్దఁబడియె
రకరకంబుల వారల రాకకలిమి॥

సీ॥ కౌటుంబవిషయాదికంబులు పెరరేప
నిల్లాండ్రతోఁ గలహించువారు
సంసారరక్షణసామర్థ్యమున కోడి
వెఱవు లేమి మనస్సు విఱుగువారు
సంసారసాగరసంతరణోపాయ
మరసెడి పరమవేదాంతమతులు
సరసభావనిగూఢశైలిచే రసికుల
చెవికిఁ బాడువొనర్చు కవిజనంబు

గీ॥ కుసుమశరునిముల్కులఁ దగుల్కొనినవారు
చిత్తశాంతికి బుద్ధికిఁ జివ్రకుఁగూర్చ
దినము మునిమాపు తగ నడతెంతు రిచట
నిసుకతిన్నెలను వసంతఋతువునందు॥
సీ॥ "కలికియున్నప్పై యొదళ్లో కాంక్షవస్తు"
రనెడియార్యోక్తి యింక సిరస్థకంబు
సిటినతపదయుద్ధతి నెగడియుండ
నిట్టిపల్లకు రాఁబోము కృష్ణవేణి !॥
మ॥ ఋతురాజంబగు నీవసంతమున బీరెండం గడుంబుచ్చి స
న్మతి సాయంతనవేళ నేత్రయుగసంభావ్యప్రభావ్యాప్తనై
కతవి స్తీర్ణపవిత్రకావిమలభాగంబుల్ బ్రవేశింపవా
యతిథిశ్రేణిని సత్కరింతువుగదమ్మా! కృష్ణవేణీనదీ ! "॥
వ॥ అనుచుం గతిపయపదంబులు నడచి యెట్టకేలకుఁ నొక
పులినోపరిభాగంబున నధివసించి వెండియు.
మ॥ "అతికరుణారసార్ద్రహృదయంబుగతిన్ నదియేటిపట్టు సం
భృతపరిశుద్ధదివ్యజలబింబితమై తనరారెఁ దత్ప్రచో
దితబహుశీతలానిలగతిన్ సికతాణువు చల్లనై సమం
చితముగఁ గృష్ణవేణిరో ! విశేషసుఖంబొడఁగూర్చె నాకిటన్॥
ఉ॥ ఎన్నఁడుపుట్టియుంటివో గ్రహింపఁగలేము పురాతనాంధ్రదే
శోన్నతి నీకుగోచర మహో ! పలనాటిమహాబలుండు బ్ర
హ్మన్న నినుఁదరించుసమయంబున నక్రముఁద్రుంచివైచె నా
యన్ననుజూచు భాగ్యమది యబ్బెను నీకు నదృష్టసంపదన్॥
ఉ॥ అంతటిమండలాధిపతియై సరిలేని లసత్కవిత్వవి
శ్రాంతుల నష్టదిక్కరుల సాఁకిన క్ష్మాపతిఁ గృష్ణరాయలన్

సంతతరాజ్యవిస్తరణశాలిని గంటివి దాఁటువేళ ని
కెంతటిభాగ్యమబ్బె జననీ! కదుధన్యవు కృష్ణవేణికా!

గీ॥ ఎలమి సుప్రసిద్ధాంధ్రకవీశ్వరులను
బ్రథితసత్కళాజ్ఞానపారంగతులను
నడిమెసంగని యాంధ్రరాజన్యవరుల
నెందఱను గంటివో దాఁటఁ గృష్ణవేణి ! ”

వ॥ అని కృష్ణానదిం గూర్చి కొంతవడి తనలోఁ దానుగ్గడించు కొనుచుండు నవసరంబున.

మ॥ లలి నాడాడ జలంబులోఁ మునిఁగి లీలాస్నానముల్ జేయు ను
త్పలనేత్రల్ నునుమేననించిన సుగంధద్రవ్యముం గాంచునా
తెలినీటం జలమాడి యంతటఁ బవిత్రీభూతుఁడై పుష్కరాం
జలిదై పయ్యెరకుజ్జడిచ్చె సముదంచన్నిర్భరాతిథ్యముల్॥

వ॥ అంత మనంబునఁ బొలివోని యానందంబున హాయి కగ్గంబయి

ఉ॥ “చల్లనికమ్మతెమ్మెరపరిసారము గల్గుచునుండ సర్వజీ
వోల్లసనంబు సాగును వయోభరితుల్ సుకుమారసుందరీ
వల్లభులుం బీటీవిటు లవార్యముదంబున నిట్టివేళ ను
త్ఫుల్లమనస్కులై తిరుగఁబోదురు నవ్వులపల్కులొల్కఁగన్

క॥ చిత్రం బగురో త్రఁజను
స్నాత్రులుఁ దా మొంటిచనక జంటలుగాఁ గ్రొం
గ్రొత్తతమిని విహరించు ను
దాత్తత నెల్లరకిదియె యదను సుఖపడఁగన్ ”

సీ॥ పికిలిపిట్టలజంట పింపిసలాడుచు
మూచూచుకొనుచు నింపులు వెలార్ప
నల్లదే! వినువీధి సాలాపధోరణిఁ
బికదంపతులు పర్వు వెట్టుచుండ

ఘనరాగవివశమై కారండవయుగంబు
చికిలిచూపు పొండొరుఁ జిలకరింపఁ
జకచకలాడుచు శారికామిథునంబు
సరససంభాషణాసక్తి నుండ
సువ్యాకవయోను ప్రియమునఁగూడియుండఁ
జూచి నిట్టూర్పు విడచి యశ్రువుల నింతు
నెంత తలఁచెను దుర్విధి యేమి సేతు
వలపు నమ్మఁగలిసె మచ్చరముగాగ"
మ॥ అని కైవ్రాలి నితాంతరాగయుతవాక్యాబద్ధదృష్టాంతశు
ద్ధనిమీలన్నిజనేత్రపద్మ్యుఁడగుచుం దెల్విన్ సగంబేద సం
తత నిశ్వాసపరంపరల్ దఱుమగా దాఘిష్ఠమాత్రంబులై
తనరెన్; మానస మొంతొ చంచలము—కాదా—శాంతిఁ గోల్పోవునే?

వ॥ హృదయగతవిషయంబున నొడలింత మఱచి సకలనక్షత్ర సముదయంబునను విచలచ్చంద్రికారసంబుచే ధవళీకృతంబగు నంబర తలంబున స్వభావజన్యసుధామరీచులచే విరాజిలు రాకానిశాకరుని పగిదిఁ గించిద్వృద్ధవయఃపరిపాకుండగు సవిత్రుని కిరణంబు లాడాడ సికతాణువ్రజంబులఁ బ్రజ్వలింపఁ బయస్స్వచ్ఛసైకతోపరిభాగంబున నాలేఁబ్రాయంపువన్నెకాఁడు తలవ్రాల్చియుండ,

సీ॥ విడగ సీమంతమును దిద్ది మడఁగియున్న
చిమ్మచీఁకట్లు నీలాలకమ్ము లెల్ల
గాడ్పువసికూన పైఁబడ గంతులైచెఁ
దమ్మిమొగమున భృంగసంతతులకరణి॥
సీ॥ ప్రకృతిపోషితయగుచుఁ జూపఱనెలర్చు
వనలతికఁ బోలె సమాజవర్ధనముఁ గాంచి

కొనలమెలివడు నూనూఁగు నునుపుమీఁస
మా మొగంబున కెంతెంతొ యందమొసఁగె॥

మ॥ ఘనతాటంకవిఘట్టితారుణమణీకాంతిన్ శ్రవోయుగ్మమొ
య్యన మించన్, మణికట్టునందు ఘటికాయంత్రంబు కొంచెంబుగన్
ధ్వనిసేయన్ వలచేతిలో గమనదండం బొప్పఁగా నట్టి మో
హనరూపుం డొకగొప్పయింటియువకుం డంచున్ వచించుం జగన్॥

గీ॥ వెల్లచాకింటిమడత లబ్బైనముచేతఁ
దొడిగియునికిఁ జూపఱకును దోఁచు లెస్స
కాని నెవ్వగ శిరిగొని మానసమున
నడఁగు మున్నీటిలో బడబాగ్నివోలె॥

క॥ కదలక మెదలక దుఃఖా
స్పదుఁడయి యా యువకుఁ డిట్లువన్నుండియుఁ దా
గొదకొని కనువిప్పను విని
"యిడిరా! యిందుంటివ్రాయి" యనెడుమృదూక్తిన్॥

గీ॥ లేచి "రా ర"మ్మటంచు నాంగ్లేయభాష
సమవయస్కులకు సఖుల కమరునట్టి
గౌరవోచితరీతి రాగమున నొసఁగె
నమ్మలిక నాఁచి యతఁడు ప్రత్యుత్తరంబు॥

గీ॥ "ఎంతసేపయ్యెవచ్చి యిచ్చోటకు నీవు
మాగృహంబునకరిగి, లేమి నటనుండి
తిరిగియాడాడఁ, గొనకు నేతెంచితి నిటు
రామమోహన! నినుజూడఁ బ్రీతి చెలిమి"॥

క॥ అని తిన్నె నధివసించుచు
గొనబగు చేఁగఱ్ఱ పక్కకుం జేర్చి "మో

హా! నేఁడే వింటిని నీ
కనలేని మనోవికార మేర్పడె” ననుచుఁ॥

గీ॥ పూర్వసఖుఁడైన శ్రీరామమూర్తి పలుక
“నెపుడు వచ్చితి వీవు చెన్నపురినుండి?
కోటుల వ్రాసితి పట్టపరీక్షలోన?”
ననుఁడుఁ దగురీతి నుత్తరం బాడియుతేఁడు॥

గీ॥ “ఈవిషయమెల్లఁ జెవిఁబడె నింట నేఁడె
ఆమెప్రాయం బదెంత? విద్యావతియొకో?
నీదుచరితంబు నింత విస్తరింపు మటుల”
ననుఁడు రాలుపడు నెలుఁగు నాఁచి యాఁచి ॥

మ॥ పయిపైఁ బొర్లు నవార్యదుర్భరమనఃప్రత్యక్షదుఃఖోర్మికా
చయము గన్నులందునిల్పుచు, “వయస్యా! బాలికాబాల్యవి
ద్యయు నుద్దిష్టవివాహసంఘటనచర్యల్ గూర్చివిన్పింతునం
తయు నీకం టెసుమిత్రుఁ డెవ్వఁ డిలపైనాకుఁ విచారింపఁగన్॥

ఉ॥ తల్లి గతించె నాకు, నటఁ దండ్రియు స్వర్గముదాఁటుపట్టు సం
ధిల్లఁగ నీచిరప్రియుని నెయ్యముతేపున రాజశేఖరున్
మెల్లనఁ జేర్చి “మోహనుఁడు మాసుతుఁడే” యని వానిచేతికో
నుల్లముకూర్మిఁ బెట్టి నను నుర్వి బాయుట వింటివేకదా॥”

వ॥ అనవుడుఁ “బూర్వమొక్కప్పుడు నీవే నాకీవిషయంబుఁ దెలుపుడు సేసితివి. నేనీయూరనుండు టటుపై విద్యాభివృద్ధికారణంబుగాఁ జెన్నగరావాసంబుఁ గల్గియుండుటయు నదిగాక మనగృహంబు లొండొంటికి దూరంబుగా నెలకొనియుండుటయుఁ బరస్పరసంభాషణంబుల నెన్నండును గృహవిషయంబులు రాకుండుటయు మొదలుగాఁగల హేతువులచే ననంతరోదంతంబు నాకెఱుకలే” దని రామమూర్తి

వక్కాణింప రామమోహనుం డంగీకరణసూచకశిరఃకంపనం బొనర్చి విచుమని,

క॥ "నాఁడాదిగ నుంటిని నా
కేమగడ యతండెగాఁగ నెంచి; యతనిపూఁ
బోఁడియు గుణనిధి; పాపము
తోఁచుపడెన్ నాకు నెల్లతొందరల సఖా!

క॥ మగలూరక తెచ్చుటె కద
మగువలవే మాట మంచి మర్యాదలు
పెక్కగతులఁ గీర్త్యపకీర్తులు
చిగిరించును వారిప్రకృతిఁ జేసియె పృథ్విన్॥

క॥ తనతోఁబుట్టుప్రగతిఁ జూ
చెను బెంచెను బెద్దవానిఁ జేసెను హృదయం
బున నజమర యూవంతయుఁ
గనుపడ దాలేమ కెపుడుఁ గావింతు నతుల్॥

ఉ॥ ఐదవయేఁట నన్ను బడి కంపి క్రమాభ్యసనాతిమాత్రసం
పాదితరాజకీయకళఁ బండితుగా నొనరించి రెండు నా
జోడికి వారెమూల మితరుల్ సరిరారు తదీయశీలరా
గాదులఁ బోల్చిచూడ నరయన్ మొగమోటపుమాటగాదుసూ॥

వ॥ మఱియును వారలకుఁ బాపము పుత్రసంతానంబు లేదుగాని నేనింట నడుగుపెట్టిన నాలుగుసంవత్సరంబుల కొక్కపుత్రిక మాత్రముదయించె.

శా॥ ఆకన్యామణిఁ బుత్రపుత్రికలుగా నాత్మం దలంపూనియ
స్తోకప్రీతి దలిర్ప నాచిఱుతముద్దుంబిడ్డ నల్లారు ము

దైకొప్పొంపఁగ వెండకన్నెఱుఁగపై కత్యంత సంతోషభం
గీకల్లోలినిఁ దేల్చి కిన్వకును నక్షీణపరీకారంబులన్॥

ఉ॥ పుట్టినవెన్కఁ గొన్నిదినముల్ మధురోదితభాషణంబులం
బొట్టినకమ్మదేనె రుచి దోఁపఁగ డగ్గఱి చేంక నెత్తుచున్
బెట్టితిఁ జెక్కులందుఁ దనివింగను ముద్దుల నాకురంగపై
నుట్టిపడెం దదాదిగ మహోజ్జ్వలరాగరసావలోకముల్॥

సీ॥ ఎత్తుకొనుసేఁడు కడచనఁ జిత్తవృత్తిఁ
జూచి "విద్యావిహీనః పశు"వని యెఱిఁగి
బాలికాపాఠశాలికాభవనమునకు
రాజశేఖరుఁ డంపెఁ గురంగనేత్రి॥

సీ॥ ప్రాగ్దిశాభాస్కరబాలాతపరసంబు
నెమ్మోముకాంతికి నిగ్గుఁ గూర్ప
శీతలానిలపోతసేవానిరూఢత
బడి కేగునలఁతడందడి సడల్ప
లలితకస్తూరికాలాలాటికంబున
ఫాలంబు వింత చెల్వమునఁ దనర
సారంగశాబసంచారంబువడువున
బిల్లలతో గంతులుల్లసిలఁగ
రవలముక్కుపుడక రత్నాలహారముల్
దళుకులింపఁ బలకఁ దోడఁగొనుచు
బడికిఁ జేను కురంగి బాల్యంబును స్మరింపఁ
గ్రిమ్మదుఃఖపూర్తి రామమూర్తి॥

వ॥ ఇట్లుండ నొక్కనాఁడు రాజశేఖరుండు నన్ను జేరంబిలిచి.

ఉ॥ బాలిక కాంగ్లమంతగ నవశ్యముగాదు; స్వభావ నిర్దయుల్
మూలకుఁ బాయఁద్రోచి మునుముందుగ నాంగ్లము మాటతోలశియా

కాలమునందు నాంధ్రకవికల్పితసుస్థిరకావ్యమార్గవ
శ్రీలలితామృతద్రవనిషేవణమే తగుఁ బోల్పచూడఁగన్॥

క॥ మనుజునకు మాతృదేవ్య
ర్చనమే పరమవిధియంద్రు శాస్త్రజ్ఞులు; శాం
తిని గౌరవంబు శీలము
ననుకూలింపంగఁ జేయు ననవరతంబున్॥

ఉ॥ స్వర్గముకంటెఁ దల్లి బహుభంగుల మిన్నయటందు రాంగ్లసం
సర్గముకన్న నీ తెలుఁగె మాన్యతరంబని యాంగ్లవాంఛ ను
త్సర్గముసేయుచుం గఱపెదన్ నతికెక్కిన తల్లిబాస, నీ
మార్గమదేమి తెల్పుమన "మామ! ప్రియా"మని సమ్మతించితిన్॥

క॥ బుద్ధిబలం బిగురొత్తఁగ
బద్ధకమను మాటలేక బాలామణి తా
శ్రద్ధాభక్తుల నూతన
పద్ధతులం జేయువ్రఁ గఱచె బ్రస్తుతిసేయన్॥

సీ॥ కొలఁదిగొప్పగను భూగోళశాస్త్రంబు
హైందవవీరరాజకథావిశేష
మఖిలమశేషాంధ్రులగు ద్రౌపదీజాన
కీపతివ్రతల దీక్షాప్రవృత్తి
సంసారనిర్వాహసామర్థ్యసముచిత
గణితశాస్త్రాదిభాగములు గొన్ని
"భక్తచింతామణీ" ప్రముఖభక్తిగ్రంథ
పద్యపాఠావిశేషపరిచయంబు
శ్రీమహాభారతాది ప్రసిద్ధకృతుల
యందు మూర్తీభవించిన యాంధ్రభాష

సరసభావరసౌచిత్యభరము లింత
దృష్టవినిర్మలబుద్ధి నేర్చెను గురంగి॥

ఉ॥ చిన్నటనాటనుండియును జెల్మి యనూనము మాకుఁ జూడకే
నన్ను నిమేష మోర్వ దిఁక నాకును నక్లైతెలంపు మొందొరుం
గన్న ముఖంబులొప్పుచు వికాసములం బ్రియమొంపువెల్లి; శు
భ్రిన్నవగోఘృతంబున విరాజిలు హోమపుటగ్నులట్టులన్॥

చ॥ చిఱుతతనంబునం జెలిమిచే నొకకంచమునన్ భుజించి యు
ష్మనుసుఁ నొక్కసేకఁజపుపై శయనించితి మైకమత్య మే
త్తఱిఁ దనరారె నన్నిట నటించితి మొక్కటిగాఁగ దేహముల్
బరఁగెను రెండుగా శివభవానులె ధన్యులభిన్న దేహతన్॥

క॥ మా యనురాగము దైవస
మాయోగము, తనకుఁ దానె మంజులతాప్తిన్
మాయందుఁ బుట్టి కనఁబెం
పై యొప్పారె వివిధసమయములబలమునన్॥

గీ॥ గాఢరాగమునకుఁ గలరూపు సెప్పెదఁ
గాగణపిహితంబు సారదోహ
దంబు నిశ్చలంబు తలఁప నపారంబు
నిరుపమక్రియంబు నిర్మలంబు॥

సీ॥ మోక చెప్పైన పగిదిఁ బ్రేముడి కరంబు
నాటుకొనియెను మానెమ్మనంబులందు
నాడఁబెఱుకంగ నెవ్వరు నోపలేని
దశకువచ్చెను గాని యంతయు వృథగద॥

శా॥ పోలన్ భేదము గానుపింపఁ దొడఁగుంబూర్వోత్తరప్రేమలన్
జైకొఁ జిన్నతనంపుఁబ్రేమ విడిపోవచ్చున్ వియోగంబుచేఁ

జాలక; బిమ్మటిప్రేమ ముజ్జ్వలరహస్యంబై వియోగంబుచే
హ్రీలంబోవనిదై పటిష్ఠమగు యుద్వేలంబునై చొప్పడన్॥

క॥ బాలామణి తద్విద్యా
లోలత నివ్వటిలి వయసులోఁ బడెడు నెడన్
మేలెంచు పంచబాణుం
డోలముఁగొనె నాకురంగి యుల్లముఁ బోరన్!

గీ॥ అలివినీలాలకములు, దేహంపుసౌష్ఠ
వంబు, హాసంజాయ జిల్గుఁ బావడలఁ బ్రీతి
మందగమనంబుఁ జిఱునవ్వు మంజుదృష్టిఁ
గాంచి పువుఁబోఁడు తొడె వింటఁ గలికి ములికె॥

మ॥ అదె ప్రారంభము రాగభేదమున కాహా! మన్మథుండా మెఱ
న్మది మాటూని తదీయ రాగరసశుంభద్బింబితాకారుఁడై
యదియేమో తెలియంగరాదిక వయస్యా! నన్ను మోహంబుచేఁ
బడ నా చూపులఁ గ్రుమ్మరింపఁ బురికొల్పం జొచ్చె నొక్కమ్మడిన్॥

ఉ॥ ఎంతటివాఁడు మన్మథుఁ డహీనపరాక్రమదుర్జయుండునా
యంతటివాఁడు వాని కెదురాడుటయా! మఱుమోహముం గొన్న నా
పంతము నెగ్గునా? కుశికుపట్టి తపంబును పీటఁబుచ్చి వి
భ్రాంతిని మున్గెనా వినమె రంభకునై మును పీనిపోటులన్।

గీ॥ కలుగునవకాశములను సంకల్పసిద్ధుఁ
డెడలనీయక పొంచుండి యేయుచుండె
లేవయసుక్రీడలందోఁచు లేటికవను
గాపుఁ గొంచు నెక్కుడు వేటకాని పగిది॥

క॥ పలుకాడుటయే మానితి
మఱుకమెయింగాదు ప్రీతి నా కాదేమో

శేఖరుం డొక్కమొగి విలసిల్లు పెండ్లి
పనుల సవరించె నతిపర్వంబుగాఁగ॥

క॥ వైవాహికదినములు తీ-
ఱో వచ్చె నంచు నెమ్మనములు బెగ్గిలి చిం
తావైక్లబ్యము పైఁబడె
నేవిధులఁ బరస్పరానభిజ్ఞతమూఁదన్॥

మ॥ మమకారంబునఁ బెంచి పెద్దయొనరింపన్ నేర్చి యాలంబసం
గమమున్ బూన్పఁగఁ బ్రేమవల్లరి కిసీ! నాశంబు గల్గున్ సమూ
లము నేఁ డెల్లి యటంచు నొండొరుల ముల్లాసంబులం దక్క యు
ల్లములం దొంతగఁ దల్లడిల్లితిమొ పల్కంజాల నిప్పట్టునన్॥

శా॥ చింతాశంకువు మాదుచిత్తములఁ నిక్షేపించె నీపెండ్లి నై
రంతర్యంబది యుద్ధతిం గదలఁబాఱున్ బట్టి పల్లార్చెఁబో
యంతస్తాపము; పాణిసంగ్రహణసమ్యగ్బోధఁ గావించియా
కంతుం డెంతటిపాతకుం డిపుడు విఘ్నంబుం బ్రయోగించెడిన్॥

గీ॥ పరిణయవిధికి వేగిరపాటు సనదు
హెచ్చుతగ్గైన నాజన్మ మేడ్వవలయుఁ
గన్నె కితవుగాని మనువె కట్టిపెట్టు
రాజశేఖరుమత మేమొ రాదు తెలియ॥

క॥ పరిణయచ్ఛేదమునకుఁ గా
రణ మాతనిగృహిణియె, కురురాట్కులనాశం
బున కాశకుని విధంబున
వనితాసంకల్పబల మవార్యము జగతిన్॥

క॥ తలిదండ్రులతలపోఁతకుఁ
గలఁగుచు నావన్నెలాడి కడకున్ నునుసి

గ్గాలయఁగ వెడలంబుచ్చెను
దెలివిం దల్లికి నసమ్మతిని పెనయమునన్॥

గీ॥ కినిసి కాంతమ బాలపైఁ గేక వేసె
నేను నాద్యంతమును వింటి లోననుండి
యంతఁ గొనయూసయును నంతమయ్యె నంచు
దుఃఖవీచీపరంపరాందోళనమున॥

వ॥ మేమిర్వురము లోలోన నావరించిన యమందవ్రీడాభరంబున నొకరికొకరు తెలుపుకొనక పరితపించుచుంటిమి. ఒకనాటిమధ్యాహ్న కాలంబున నొంటరిగా శయ్యాగారంబునకేగి,

గీ॥ వేల్పుబొమ్మను దర్శించి పృథ్వి వ్రాలి
సరగ సద్భక్తినిష్ఠాపురస్సరముగాఁగఁ
బ్రార్థనముఁజేసి లేచి యర్పణమొనర్చెఁ
గరము మోదప్పల నామనోహారి కురంగి॥

గీ॥ భక్తవత్సలుండు భాగవతునిబోల్కిఁ
బ్రేమరసభరంబు వెల్లివిరియ
వెంటనంటియుంటి విరిబోఁడి నెల్లప్డుఁ
జిత్తవృత్తి మొగము చెలువుఁ గాంచె॥

గీ॥ దేవతాచారుచిత్రేక్షణావసరముఁ
దెలిసికొని యొంటినుండె నానలపుదీవి
యనుచుఁ దఱియంగఁజనుకోర్కె యలమియున్న
నోహటించితి నెందులకో యెఱుంగ॥

మ॥ అదివ్రీడాభరమో మఱేమొ ప్రియమిత్రా! నాకు దుర్జ్ఞేయ మ
ట్టిదశన్ వర్ణనఁజేయ నేకవితపాడౌం బూర్వ? మాభంగినే
గదిగుమ్మంబుసమీపమందు నిలువంగా నాకురంగాక్షియుం

బదములఁ దాటఁ్రోల వచ్చుచుండె వికసద్భాభోపభావాకృతిన్॥

శా॥ ఆశాబంధము త్రుంగునం చడలి పేదైయున్న నెమ్మోముతో
నాశాతోదరి వచ్చుచుండ నెదురై యడ్డంబుగానిల్వఁగా
రాశీభూతవికారముల్ నెఱసె దిగ్భ్రాంతింగనన్ వేణికా
పాశం బల్లన నూడిజొజ్జెఁ జెమటల్ పైఁబట్టె వామాక్షికిన్॥

గీ॥ చిఱునగవు లంతఁ గెమ్మోవిచివ్రరునందు
ముత్తువ్ర పొద వెట్టుచుండ నెమ్మోము వాంచి
నేల రాయుచు నిలుచుండె నీలవేణి
కామదేవుని చెఱకుసింగాణియనఁగ॥

క॥ చిరకాలముపిమ్మట నెం
డొరువుల సమ్ముఖసమాగమోదంతం బా
విరిబోఁడి విచారంబును
మఱపించి విలాసవిభ్రమంబులఁగూర్చెన్॥

గీ॥ గాఢదుఃఖకషావృత కంఠుఁడనయి
యెదుటఁబడీ బాల కేను నో రెత్తకుంటి
నోటఁ గుక్కిళ్లుమ్రింగఁ గన్నుగవనుండి
తొరఁగె బాష్పంబు నెపమున దుఃఖవీచి॥

వ॥ అంత నాకురంగియు స్వభావసిద్ధంబుగా విచారంబు పయి పయిం గవియ విలాసంబులు సమసి యశ్రుకణస్వచ్ఛముక్తామణీదామకంబును జొర్చుచు దయనీయకరుణారసమూర్తి సన్నిధిసేసినట్లు పొడగట్టె నెండీయు,

మ॥ ద్వివిధంబుల్ నయనాంబువుల్; హృదయబందీభూతదుఃఖార్తినో
మిత్తులం జేర్చిన సంతసంబునను జృంభించుం డగన్ గాసి వె
ల్లువలైపాఱిన యస్మదశ్రుకణముల్ పొల్పారె సంతోషదై
న్యవికారంబులు రెంటికిం దగిన బాంధవ్యంబు సాధించుచున్॥

శా॥ చింతాపిచిని నిల్వరించి పసు లాసీనుంబు నేత్రెంతురం
చంత స్ఫూరక తత్తఱింపఁగను మోహాం బేను సైరెల్గుకో
నెంతో కష్టముమీఁద నుస్సురని "హా యేణాక్షి! కన్నెత్తువా
యింతే నీకును నా"కటంచిఁకను నే నేమేమొ పల్కం జొచ్చెన్॥

వ॥ అంతశరీరంబుఁ గొంచెమెత్తి కనుఱెప్పల నొకప్రక్కకు సారించి.

క॥ బదులాడక నిలుచుండక
పదపదమని తఱిమినట్లు పయ్యెద చెఱఁగున్
వదనంబునందుఁ జేరిచి
గదిదాఁటి కురంగి దొడ్డికడకుం జనియెన్॥

వ॥ అంత నేను.

చ॥ "చిఱుతతనంబునుండి పెలపిల్లినప్రేమముచేతఁ గన్నె నే
బెఱుతివియంగనీక యట విస్తృతమానసికవ్యథం బొరిం
బొరిఁ బలుకాడ నెంత పొరపొచ్చెమునన్ బదులీక యోగినం
చఱిముఱితో మఱింతగ దురత్యయదుఃఖదవానలంబునన్॥

క॥ మ్రగ్గుచుఁ గొమ్మలనేస్తం
బెగ్గగుఁ గాలాహిస్నేహమే యుపమింపన్
సిగ్గింత లోన నెంచక
డగ్గుత్తిక వెట్టి యేడ్చుటకుఁ బాల్పడితిన్॥

క॥ "మోహపిశాచం బెంతటి
దాహో! హృదయాధివాస మందుచుఁ బ్రాణం
బాహారముగాఁ గొను నా
కూహాంతరమేమి తోఁచ దోరుపుతలమే॥

ఉ॥ బాలను బల్కరించి కడవంబడె నొక్కశరత్తు; మోహాద్ర

జ్గాలసమంచితాననవికాసమునం బ్రణయంపుఁదీవకుం
జాల దృఢత్వ మేర్పడియు శాశ్వతనాశము కూడముట్టె నం
చాలలితాంగిఁ జేరఁజన నక్కట పల్కకపోయె నిర్దయన్

గీ॥ ప్రస్ఫుటంబుగఁ దనమీఁద బాళినాకుఁ
బాటమరింపఁ బుష్పాస్త్రశరపుంలకు నెంత
పల్లటిల్లి మనోవ్యథఁ బట్టినాను
యెఱిఁగి యెల్లెగె నామనోహిని కురంగి॥

క॥ ప్రతిభాషణమున కోడిన
మతియలమటఁ బల్కు నామమాట వినమికిం
గతమేమి? నమ్రవదన
ప్రతిరుద్ధవిశాలదృక్ప్రసారపర యగుచున్॥

మ॥ అనురాగంబును జెంతఁజూచిన నసాధ్యంబయ్యె; మోహంబున
ర్ధనమాఁ గాని యొకింత కీడ్వడదు; దౌర్భాగ్యప్రభావంబు పెం
పున నిట్లుండెఁ బరిస్థితుల్ గటకటా! పుంఖానుపుంఖప్రసా
రణకందర్పనిశాతబాణవితతిం బ్రాణంబు లూటాడెడిన్”

వ॥ అని తలపోయుచు నాఁటిసంగతులఁబట్టి యింతదనుకఁ గురంగి చూపిన ప్రేమంబు కాపట్యభూయిష్ఠ మైనదని దృఢంబుగా నెంచి నిశ్చేష్టుఁడనై కొంతవడి నిలువంబడి యనంతరం బచ్చోటు వాసి నాశయ్యాగారంబుఁ బ్రవేశించి సెజ్జపైఁ దపించుమై నేర్చి చింతాపారావారంబునఁబడి కొట్టుకొనుచు నిలువెడలకుంటి. రాత్రిముఖావసరంబగుడు రాజశేఖరుండు వలయుపనులఁ గావించికొని గృహంబునకు విచ్చేసి భార్యానీతపాద్యప్రక్షాళితపాదయుగళుండై దప్పిఁ దీర్చికొని మందిరప్రఘాణంబు వెలిపట్టున శయనోచితాసనంబులోనుండ నాఁటిమధ్యాహ్నంబునుండి గోష విద్రుమాళికిఁ జివురుటాకులగు నేత్రంబుల నన్ను జూచుచున్న మాయుత్త

భర్తృసాన్నిధ్యముఁ జేరియేమేమొ రహస్యంబుగాఁ బెద్దయుంబొద్దు పలికె నంత నిర్వురు లేచి భోజనాగారంబుఁ బ్రవేశించిరి. నేనును వారి తోడం గుడిచి యారాత్రిపరుండితి.

గీ॥ రేపకడ లేచి కాల్యకర్తవ్యతఁ దనయి
పాపటను దిద్ది తిలకంబుఁ బట్టి వ్రాసి
వస్త్రములఁ జాలఁ జుట్టుచుండ భాస్వన్మయూఖ
తరళితార్యాంశు ప్రాఙ్నగోదరమునవల॥

గీ॥ అంత గదివీడి లోనికి నరుగుదేరి
యుదయపానీయమును దాఁపుచుండ నేను
ఆవలకుదొల్చి ప్రేమ నేత్రాంచలముల
నెసఁగుకోసంపుఁగెంపును ముసుఁగు వెట్టి॥

ఉ॥ దగ్గఱి రాజశేఖరుఁ డడంకువ నిల్చిన నన్ను జూచుచుఁ
మొగ్గమహాధికారమున భూమిఫలం బిలు సేరదింకఁ బో
దగ్గది నేఁడె నీవు త్వరితంబుగ నాపాలమూళ్ళ కంచుఁ దా
నెగ్గొడఁగూర్చి యేగె హృదయేశ్వరికిఁ వచియించు వేడుకన్॥

సీ॥ ఆజ్ఞాతిరస్కార మాత్మ జనింపమిఁ
బల్లెలపయనంబు వల్లెయంటి
నటమీఁద వెడలి శయ్యాగారమున కేను
గడుపుచుమ్మలువాఱ నడలియుంటిఁ
"బూర్వదినంబున ముడివడ్డ సంభావ
ణముఁగూర్చి తండ్రి కంతయువచించి
చెలిమి నెనరుల విశ్లేషంబుఁ బెరరేఁపి
కానివాని నొనర్చెఁగా కురంగి
యెంత మోసగించె నంతంబునకుఁ దన

పరిణయంబుఁ జూడఁ జనికిరానో
యూరినుండి వెడలఁ దీరుపుఁ జేయుంచె"
నంచు నేడ్చియుంటి నాత్మఁదలరి॥

వ॥ ఇట్లు దుస్తరచింతాపయోనిధినిమగ్నుండనై నాఁటి మునిమాపున వచ్చు ధూమశకటంబులో వెడలి యాగమనకారణంబును ముందిడుకొని యూరూర సంచరించుచుంటిని గాని హృదయవేదనాభరంబున దినుతిండి నీరగుచుండె.

చ॥ అరయ నిరంకుశప్రభుఁడయూన స్వదేశముఁ బాసియున్న స
త్పురుషుని పోల్కిఁ బెంటి విడిపోవఁ దపించెడుపావురంబు మా
దిరిఁ జాలమూర్ఖులోన ఘనుఁడీర్ణ మనఃపరిశీల్యమానదు
స్తరవిరహాగ్నిశోకపరితాపమునం గడగండ్లఁ గూరుచున్॥

ఉ॥ కొంటలనైతు లీయమికిఁ గొందరవెట్టఁ దొడంగ నెట్టిటో
దాఁటె దినంబు లివ్విధిఁ బతాంగివివాహమహోత్సవంబు ల
చ్చోటఁ గ్రమించు మున్నెయని శోకముసత్తువఁ బీల్చుచుండడ
బ్బాటుగఁ గమ్మువచ్చె బెజవాడపురంబుననుండి పొద్దుటన్॥

వ॥ నాఁపుఁడు మాట కష్టంబాయు నెయ్యుండగు రామమూర్తి తద్విజయవాటికాప్రేషితలేఖావిశేషకు లెవ్వరని పృచ్ఛింప రామమోహనుండు పదంపడి సోపాలంభంబుగా.

క॥ తలనుండి శోకవజ్రము
గిలికెను మామామయే సఖిలేఖనము
చెలసె మనఃపద్మము శో
ద్రోలుతన, పేజోట వినుగుదోఁచె నెడంతన్॥

గీ॥ అంత మొదలిడి కొనవాఁక నకట! చదువ
నేరనైతిని లేఖాప్రణీతవాక్య

సమితిసంజన్యకరుణారసపరివాహా
వీచికాభంగతాడనవివశుఁడనయి॥

వ॥ అనంతరంబున దానిని మెలమెల్లఁ గొనవట్టించితి.

శా॥ నాచేపట్టుట కిచ్చగింపకయె యున్నన్ మన్మథుం డాకురం
గీచంద్రానన, మోహరోగమును నిక్షేపించి చిత్తంబునం
దేచెం జాలఁ గృశించిపోయెనఁట యుస్సీ! శల్యదృశ్యాంగియై
వాచామాంద్యము కొంకించెనఁట సద్వైద్యుల్ విచారింపఁగన్॥

వ॥ వివాహప్రయత్నంబులన్నియుఁ గొనసాగింపక విరమించితినంత మఱియును.

ఉ॥ కాయికజాడ్యకారణము గాంచే మనోవ్యథ యందు, మందులన్
వేయుచుఁ, బ్రాణభీతిఁ గని వైద్యులు గాచుచునుండ "మోహనా!
యేయెడ? నిన్నుఁ గాంచఁగ నదృష్టము లేదిఁక నాకు టంచుఁ దాఁ
బోయెడినంట మోహనునిఁగూర్చి పలుకుఁ గల్వరింపులన్॥

శా॥ "మోహోత్పాదితమానసాంతజడతాభోగంబుచే బట్టెఁడే
నాహారంబును గొంటకుండె, నిఁకఁ బ్రాణాపాయసూచజ్జన
వ్యాహారంబులు దందడించెఁ బయనంబై వచ్చి శీఘ్రంబునన్
నా హేమాంగిని ముద్దుతల్లి లతకూనం జూడు మేకాత్మజన్॥"

క॥ అనియుండుదుఃఖలేఖను
గనుగొని కడువెచ్చనూర్చి కాయువు లోఁగాం
గిన గన్నీరొట్టితి నే
మనిచెప్పుదు నాఁటిమానసాందోళనమున్॥

గీ॥ పెండ్లిమాట తలంపులోఁ బెట్టికొనఁగ
లేదు; మానసంబున నడువీదియందు
వ్యాకులాభీలవిషయ నుత్తాడఁజొచ్చెఁ

దోఁచెకచరించు దుర్యోగధుర్యుఁ బోలె॥

మ॥ "తనచేపట్టఁగ నోఁచకుండినను నేత్రద్వంద్వ సంతోషకా
రణసంప్రీతిగుణభాగ్య మెప్పుడయినం బ్రాప్తింపదే దానికిం
దను నష్టంకులు లేవటంచుఁ దలఁపక దుర్దైవ మిమ్మాడ్కియ
య్యెను నీకడసాటిచూపిడఁ గురంగీ! యెంచితో లేదొకో॥

గీ॥ అల్లనాఁ డేను నిన్నుశయ్యాగృహంబు
ముంగిటనునిల్పి బహుళమోహముహ్యమాన
మానసంబున నిసుమంత మాటలాడఁ
గోపమునఁబోతి వనుకొంటిఁ గుందరదన!॥

శా॥ ఆపై నెంతగ నొచ్చికొంటినొ కురంగాక్షీ! యెఱింగింపఁగా
నోపం జుమ్మి భవన్మనోనిబిడమోహోత్సేకరాగంబులా
క్షేపింపం దలకొంటి నిన్నిదినముల్ శ్రీగంధసద్వాసనా
వ్యాపారోపమమంజుమోహ మని తోఁపఁ లేదు నాకప్పుడే॥"

కం॥ అని నానావిధములుగా
మనమున విరహోత్కటార్తి యత్యాకులవె
ట్టిన గాల్నిలుపక సాయం
తనశకటంబున నె దిగితి నగరమునందున్॥

వ॥ అప్పుడు పేరెమువాఱుతురంగశకటంబులోఁ జని తద్గృహ బహిర్ద్వారంబు చేరి పరీక్షాఫలంబెఱుంగఁ దొట్రుపడు విద్యార్థికింగల యాతురముతో వెజ్జునాన నిశ్శబ్దంబై యున్న బాలికాశయనాగారంబు లోనికిం బ్రవేశించితి నంత మా మామయగు రాజశేఖరుండును దత్పార్శ్వాసీనయయిన కాంతమ్మయు నన్నుఁ జేరి ముమ్మరంబగు ప్రేమంబున గాఢాలింగనంబుఁ గావించికొని కన్నీరుమున్నీరుగాఁ దొరఁగ "నాయనా! ఇట్టిఆపత్సముద్రమధ్యంబున మునిఁగియుంటిమి. నీరాకకై నిరీక్షించు

ముంటి"మని కూర్చుండఁబెట్టి పాద్యపానీయంబు లొసంగి తత్తనయారోగంబు నానుపూర్వి నడిగి—నొక్కి—నొక్కి వ్యాధికారణంబునుగూర్చి పృచ్ఛింప మేనమామతోడి పాణిగ్రహణంబు తన కనంగీకారమనియు రామమోహనునినామే నాసింతుననియుఁ దద్విఘ్నప్రయత్నంబే మర్భరమనోవ్యాధికిని దినక్రమానుగతశరీరశోషణాదివికారంబులకును మూలదుంప యనియు హీనదీనస్వరంబున వెలిఁబుచ్చుట—మొదలుగాఁగల కథావిధానంబును నిరవశేషంబుగా స్పష్టీకరించి వెండియు.

గీ॥ ఉడుకునీరంబకంబుల నూరలుచుండ
నడ్డువెట్టఁగ లేక పోరాడుచున్న
నన్ను గొంపోయి తెలివిపోనున్న నాఁడు
ప్రియకురంగకిఁజూపిరి వీడ్చి ముసుఁగు॥

ఉ॥ వ్రేఁగగుకంటిరెప్పలను విచ్చి నిమేషము పాఱఁజూచి హృ
ద్వేగముతోడఁ బోల్చికొని వెంటనె సంభరితప్రమోదనా
భోగమహాసముద్రమున మున్గకతంబునఁ గన్నుమోడ్చె న
ప్డే గళితంబులౌచు మడుగెత్తె వినిర్మలబాష్పబిందువుల్॥

మ॥ బహుళవ్యాధినిపీడ్యమాన కిటు కన్పట్టంగఁ దోడ్తో ముహు
ర్ముహురున్మీలితనేత్రవీక్షణశతంబుల్ నిండినీరంధ్రమై
లహరింబోలి స్రవించు నశ్రువులు చెల్లంబో! నిరోధింప దు
ర్వహరాగంబున నెట్లో చూడఁదొడఁగెన్ వామాక్షి యుత్కంఠితయై॥

గీ॥ కొన్నినిముసంబు లిట్లుండ "నెన్నఁడీవు
వచ్చినాఁడ విప్పటికిఁ గన్పడితినొక్కొ"
యనుచుఁ దలఁద్రిప్పి పార్శ్వస్థులైన తల్లి
దండ్రులను జూచి సిగ్గున దలనువాంచె॥

వ॥ అయ్యది చిత్తంబునగ్రహించి మా కన్యోన్యసంభాషణంబు

నకు వెరవుఁ గల్పింప గదిమీఁది మాయత్తమామ లిర్వురును లోనికింజేనఁ గవాటంబు నోరవాకిలిగాఁ జేసి నాప్రాణసమానను సమీపించి మోహదుఃఖసంభ్రమంబు లుల్లంబున ముప్పిరిగొన శరీరస్పర్శసుఖం బనుభవించితి నప్పుడు.

శా॥ ఆనందంబున గన్నుమూఁతపడె బ్రహ్మధ్యానికిం బోలె నా
పై నస్మద్వివశాక్షిపద్మదళముల్ వ్యాకోచముం బొందుచో
దీనాశ్రుచ్యుతిగల్గె గ్రీష్మమున దృష్టిన్ సీరు గోత్రిలం దగన్
మేనం దేహికి స్వేదపూరకణముల్ మేకొన్న చందంబునన్॥

మ॥ భగవంతుండుఁ దదీయభక్తుఁడు ముఖాబ్జప్రేక్షణానంద మా
నుగతిన్ మేము లసత్ప్రమోదరసమందున్ మున్గఁ దత్పూర్వ మొం
దఁగ లేనట్టి రవంతస్వస్థతఁ గనెం దన్వంగి యావెన్కతే
చి గతానోన్యసమాగమప్రకటవిశ్లేషంబు మాటాడుచున్॥

గీ॥ "గాఢతాపంబు తలమున్కగా జనింప
నాఁడఁగ లేక కన్నీరు నోర్చుచుండ
మన తెలుక లేక మాయమ్మ కసఁటఁ జూచి
పోయిటిని బైఁటచెఱఁగు మోమున దగిల్చి॥

ఉ॥ ఆంటియు కాని ప్రేమ మురియాడుకతంబునఁ గాదు మోహనా!
యింత యెఱుంగలేవు; నిజ మియ్యది నమ్ముము, పెంచుచుంటి దు
ర్దాంతమనోనిబద్ధనిశితప్రణయంబను మావిమోక న
త్యంతము నే భవద్వదనదర్శనమోదరసప్రధారలన్॥

క॥ అని యల్లన నెయ్యముతో
పున దా హృదయానురాగమోహంబుల వి
న్నను సుందరి దీనస్వర
మెనయుచు మురిపెంపుముద్దు లిడి చెక్కిళ్ళన్॥

వ॥ పదంపడి యేమేమొ పల్కుకొనుచుఁ దజ్జననీజనకు లిర్వురును గవాటంబుఁ దీసి గదిం బ్రవేశించి "నాయనా! మోహనా! యేతద్దురవస్థ కంతకును స్వయంకృతాపరాధమే కారణంబు. మీ కిర్వురకు ననావశ్యకవియోగంబుఁ గల్పింపకున్న నింత చేటు వాటిల్లదు. ఇంక నీప్రాణసమానయును మా కేకాత్మజయును నైన యీ కురంగికిని నీకును బాణిగ్రహణమహోత్సవం బీకష్టంబు గడచినమీఁదఁ గావింతుము క్షమింపు"మని యుద్దఱును బలుకఁ బెద్దలదైన్యంబుఁ జూచి నేనును గంటఁదడివెట్టి వారి ననునయించితి. నాయర్ధాంగి కానెంచిన యాకన్నియ పరుండియుండి వారివాక్యంబు లాకర్ణించి యానందముచేఁ గలిగిన యపరిమితవర్ణనాతీతమనస్సంభ్రమంబున నోలాడుచుండ నవసరంబున నాత్మకార్యనిర్వహణార్థం బిండ్ల కరిగిన వైద్యులును స్నేహితులును మరలివచ్చి చూచి.

క॥ అబ్బాలిక కింతకు మును
బ్రబ్బినదుర్వ్యాధి డిందుపడుచుం దెల్విం
డబ్బాటుగ సమకూర్చుట
యబ్బుర మనుచు ననుమాన మందిరిలోనన్॥

వ॥ ఇట్లనుకొనుచుండ నిద్రాపారవశ్యంబునఁబోలెఁ గనుమూసియుండి కొంతకాలం బయినవెనుక, నమితదుర్బలగాత్రియయున యాయబల ప్రియసందర్శనానందంబుచేతను బైపెచ్చు తలిదండ్రులు తమవివాహంబున కిచ్చగించుటచే నొక్కమాఱుగాఁ గలిగినయానందపారవశ్యంబుచేతను గాఁబోలు భిషగ్వరుల యనుమానంబుల వెన్నంటి సంబంధరహితప్రలాపంబులు నుడువుచుండఁ దెలివికోల్పాటుశంకచే నింట గోలుగోలు మను నేడ్పు టెలుంగులు మిన్నుముట్టె. రోగంబు క్రమక్రమంబుగా ముదిరి భేషజానివర్త్యమానమై యుండె [illegible]

చేఁ గఫంబు కుత్తుక కెగదట్టినప్పుడు.

మ॥ అతితాపంబున నుండి త్రొల్లి కడ కొయ్యార౯ శాంతమై పూర్ణహృ
ద్గతరాగంబు వెలార్చి చూపఱకు మోదం బిచ్చుచుండంగ నా
యతదుష్కాలమహాత్వతత్వమున నస్తాంభోధి మజ్జద్దివ
స్పతిబింబంబు వితాన హా! యసువులం బాసెం గురంగాక్షియు౯"॥

క॥ అని ధారాపాతముగా
గ నిమిషాలన్నెత్రియుగ్మకమున౯ స్రవియిం
చిన బాష్పంబుల నుడుపుచుఁ
దననెయ్యుని గూర్చి యితఁడు తగఁ బల్కె౯॥

గీ॥ "రాదు మాటాడ నాకు శ్రీరామమూర్తి
'యింక; నటమీఁద నెంత విస్తృతము గాఁగ
మదిని మరపిల్లినాను యామాలమైన
మతులసౌఖ్యసంతాపదాయకుఁడె యెఱుఁగు॥

క॥ అవుడు మంచును నేదుః
ఖావేశముగుబ్బతిల్లఁ బ్రాణోత్క్రమణం
బావేళఁ గరం బేష్టితిఁ
గేవలడింభకునిమాడ్కిఁ గ్రిందఁ బొరలుచు౯॥

క॥ ధ్యానోచ్ఛ్వసితిచే బ్రి
హ్మానందావస్థకరణి నలమట వైమై
ట్టాన౯ వేసరి చెయువుల
మానుచు మూర్ఛానిబద్ధమానుఁడ నయితి౯॥

గీ॥ బాధదుర్భరతరదుర్నివార్యదుఃఖ
కలుషితస్వాంతులై దంపతులవిశేష
యత్నములఁ దెల్పిరాఁ దదనంతరమున

బడలువడ నేడ్చితిని గళేబరము పైని॥

"అకట! సజీవయై సపుడె యా లలితాంగిని డాసి చిత్తపూ
ర్వకముగ మోహవీక్షణపరంపరఁదార్చుచుఁ బల్కరింపలే
దొకదినమైన సిగ్గనెడు నొక్కపిశాచము నన్నుఁబట్టఁ గ
ట్టకడకు బాలదాఁటినయెడన్ నునుసిగ్గును వీడి పొక్కితిన్॥

నా మనోహరి నా మోహనప్రతీక
నాదుప్రాణంబు నాజీవితప్రమోద
నా వలపుదీవి నాముద్దు నాకురంగి
[illegible]ఱె దివి నన్ను జీవచ్ఛవం బొనర్చి॥

[illegible]పరకర్మల మామామ [illegible]యుధికదీక్ష
పంతతస్యందనేత్రబాష్పములలోన
దొప్పదోఁగుచునె ముగించె. దుహిత కవియె
కొంతవఱకైన శాంతిఁ జేకూర్చుకతన॥

ఆదిన మాదిగాఁగ హృదయాంతరవిస్తృతశోకసాగరం
బీఁదగలేక, యావిషయమే మఱవన్ ధృతియింతలేక యెం
తే దురవస్థకగ్గమయితిన్ గడి యన్నముఁ బోదు లోని కు
న్మాదదశాంతరం బొదలునా యనిసందియ మగ్గలించెడిన్॥"

వ॥ అని యనేకభంగులఁ బురపుర విలపించె.

। అటుపయి రామమూర్తియు "వయస్య! పురాతనకర్మకార్యసం
ఘటననిరోధ మేరికిని గాదు, నలాదులవంటివారికే
చటులమహార్తి తప్పదు భృశంబుకలంగకు మేడ్చి లాభ మె
న్నఁటికిని లేదు చేడ్పడు మనంబును నూల్కొనఁజేయు మోహికన్।

ఇంతకు నీదుకథ విపా